"అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత!
అవ్యక్తనిధనాన్యేవ తత్ర కా పరిదేవనా.

చనిపోయినతరువాత పుట్టకపూర్వము మానవుఁడు కాఁడని,

జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి
యద్‌జ్ఞాత్వాఽమృతమశ్నుతే
అనాదిమత్పరంబ్రహ్మ
నసత్తన్నాసదుచ్యతే.
—ఈశ్వరుఁడు లేఁడని,

శ్రుతి. అసదేవేదంపురాసీత్

అనియు;

"లాయిలాహ ఇల్లల్లా.
—అని ఖురానులోను, ఇట్లే మఱికొన్నియు గలవు.

"నమాంసభక్షణే దోషో నమద్యే నచమైథునే
ప్రవృత్తిరేషా భూతానాం నివృత్తిస్తు మహాఫలః."
"సౌత్రామణ్యాం సురాం పిబేత్ ప్రోక్షితం
భక్షయే న్మాంసం వైదికే హింసాహింసా నభవతి."
—అని మనువును,

"ఉషః మధ్వాసవం పీత్వా ఉషః సంపనబర్బితౌ,
ఏకపర్యంకశయితౌ దృష్ట్వా మే కేశవార్జునౌ.
—అనిపరాశరుఁడును.

* మధుసేవన మాంసభక్షణాదిదోషములవలన పాపము రాదేరవని వ్రాయుచున్నారు.

ఈ ఉమరుఖయాము, గాంధ్వసులును పాప పుణ్యములను నవి లేవనియు

తే. గీ. ఎంతకాలంబు నదిలోన నీనిధాన
రాళ్లు విసురుదు గాళ్లను గుళ్లయందు
పూజచేసి హతాశునిఁ బోలెఁ బోదు
తెమ్ము మద్యమ్ము చెలువ, ముద్దిమ్ము రమ్ము
నరకమేమిటి స్వర్గంబు నాఁగనేమి.
ఉసురువిడిచి యాలోకమన్ మునుఁగునందు
మాయమై పోయెదవుగాన మధువు ద్రావి
కలదినంబులానందాన గడుపుమెచట
కేగెదో వచ్చి తెటనుండి యెఱుఁగ వీవు.

స. శంధినిఁబోలువిద్యయును
జ్వాలనుబోలినజ్ఞానదీప్తియుణ్
బఁగినవారు లీనిశిత
భాసురగాఢమహాంధకారం బం
ధురితంమార్గమున్ గడచు
త్రోవ నెఱుంగక కల్పనాకథా
భరితవిచిత్రవాక్యములఁ
బల్కుచుఁ నిద్దురఁబోయి రెంతయున్.

ఇట్లే ధర్మాధర్మములు, పూర్వపరములు, స్వర్గనరకములు లేవు. ఇసుకనుండి తీసినబంగారమునకు దగ్ధకాష్ఠ న్యాయమునుబట్టించి మాఁడవలయును. మానవులు తృణయవవ్రీహ్యాదులనుండి రేతోరూపమున మాతృగర్భమునఁ బ్రవేశించి వెలువడుచున్నారు. నిన్న నాకులతోపచ్చగనున్న బంతిమొక్కనే నేడు పువ్వుచే నొప్పుచున్నది. అట్లే పరిణామమే మూలకారణము. అవాఙ్మానసములకు పదార్థములపై నమ్మకముంచి భూతికి, సౌఖ్యమునకు భంగముగలిగించుకొనరాదు. చిన్నచిన్న గుంటలలోనినీళ్లు కప్పలేద్చుచున్నను పశువులు త్రాగి పోవును. అట్లే తనసుఖమేకాని యెదుటివారియిబ్బందికై విచారింపనక్కరలేదు. ఎల్లవారు స్వార్థపరులైనను పైకి పరోపకారులవలె దోచుచుందురు. అదిమోసము. దానముకూడ స్వార్థమే. గడ్డియైకొఱకబడుకంటె పచ్చికొఱుకుట మంచిది. ఒకరు నిన్నువలచితే నీవు వారిని వలచుచున్నావు. ఆనందమేకాని దుఃఖమనేది లేదు. దుఃఖము నీవు కొనితెచ్చుకొనుచున్నావు. రాగమేకాని రోగము లేదు. వేడుకయేకాని వేడికోలులేదు. నిన్నటికి నేఁడొకదినము ముదిమియనహించినది. ముదిమి మేనిపై మసుసువలె మూయకముందే యిష్టోపభోగముల నందుము. నీవు కన్నులు మూయగనే నీసమాధిత్రవ్వవచ్చువాఁడే, గడ్డపార చేతధరించి నిలిచినవాఁడే దండధరుఁడగు యముడు. వానిపాంయే పాపపుణ్యములను తూఁచుత్రాసు. ఆబలిపీఠమే అన్నిటికి స్వస్తిచెప్పుమంత్రపేటిక ఏసును బలియిచ్చినారు. ఆరుధిరావలిప్తమైన బలివేదికయే యమధర్మరాజు సింహాసనము. అందు బలియియ్య

* ఖురాను మిక్కిలిదోషమని చెప్పుచున్నది.

బడినవాడు. మృత్తికారేణుసముదాయముచే పరిణమించిన ఎముకలు రక్తమిశ్రితమైన మాంసవస్త్రస్వరూపమగు వ్యక్తి. అది శరీరమును వదలి ఒకగంతువేసి వాయువులో గలిసిపోవును. దాని నెవరు పట్టుకొనగలరు? ఎవరికి కావలెను? అంతా మిథ్య. ఈశ్వరభక్తిని గూర్చి చెప్పునవన్నియు ముసలమ్మకథలు. తిని నిర్వ్యసనముగ గూర్చుండుసోమరులచే కల్పింపబడినవే. వేదాంతములు (మారిఫత్), సూఫీలు (బ్రహ్మసూత్రములు), తసవ్వుపు వ్రాసినారేకాని ఆత్మస్వరూప మిదమిత్థమని నిర్ణయింపలేక సర్వాంతర్యామియని యథోచిత నాస్తికవాదములోనికి లాగి మఱింత యంధకారములోనికి దింపివిడిచినారు. ఇవియేమియు యథార్థములు గావు. జీవించినన్నాళ్లు భోగించుటయే దారి. అదే జీవితగమ్యపథ. అని పెక్కువిషయములచే సమగ్రమైన నాస్తికవాదము నిందుపూర్వపక్ష సిద్ధాంతములచే వ్రాసి అందందు శృంగారరసస్వరూపములగు భావములచే పాఠకులహృదయమును మిక్కిలి ఆకర్షించినాడు.

ఉ. ఆరమణీమనోహరము
ఖాజ్జము ముంగురు లుంగరాలసిం
గారము పెట్టి దిద్దితి వి
కాసముగుల్కెడు ముద్దుగాల, సొం
పారఁగఁ జొంపరా దనెద
వక్కట, నిండిననాఁటి పాత్రమున్
బోరలవేసి నేలపడఁ
బోలదు నీరునునట్టులుండదే!

ఇట్టివే పెక్కులు గలవు. గ్రంథవిస్తరమని వ్రాయలేదు. ప్రతిపద్యమును భావపూరితమైన ప్రస్తావనమున కనుకూలించునట్లుండును. ఇట్లే రాజులను గూడ నిందించినాఁడు.

ఉ. గాడిదవంటి యీనృపుల
కైనను మేమిషలంబుగూర్చు నీ
తోడను నేలపాండితినిఁ
దోడ్కొనిపోయెదు పీరు విద్యరున్
బోడిమికిన్ వెలన్ బసఁగఁ
బోవరు వత్సరమేడిపించి యే
నాఁడును వేరెఁడంబువుల
నర్మిలిఁ బోయరు దాహ మారఁగన్.

అసలీతఁడు విషయాసక్తుఁడే కాఁడని, ఈతనివేదాంతములోని మధువు ధ్యానామృతమని, కాంత ముక్తికాంతయని, విషయోపభోగములు సమాధినిష్ఠావిధానము లని తూచిలు పొల్లు పోకుండ అర్థములు చెప్పువారునుకలరు. వారీతని గ్రంథమునుండియే అనేకోదాహరణములు చూపించెదరు. అవి:

శా. రాగద్వేషము లాశ్రయించి విషయ
భ్రాంతిన్ బ్రవర్తింప ను
ద్యోగింపన్ దగునా జగాన విధిసం
యోగంబుచే నింపుతో
భోగాపేక్షను వచ్చిపోయి రిటు లే
ముందింక రానున్న వా
రేగన్ జాతురో కాని యొక్కఁ డిలపై
యిష్టార్థముల్ పొందనే.

ఉ. నీవు ధరిత్రి కామవిష
యేచ్ఛలకై జనియించితందు నీ
భావమునన్ దలంపకుము
స్వార్థుఁడవై నశియించిపోగు వే
తావునుండి వచ్చితివొ
తథ్యము నీవన నేమివస్తువో
నీ విపు డేమొనర్చుటకు
నందితివో పరికింపు మెంతయున్.

మ. విషయాసక్తికి లొంగిపోవక మహా
వేగంబుతోఁ బోవు నా
విషరాశింబలె తీవ్రవహ్ని విలసత్
విస్ఫూర్తిమై దాఁచి పౌ
రుషలీలన్ మనఁజెల్లు గాని రజమై
రోదోంతరాళంబునన్
వృషవాతాహతిఁ బోవునట్టి బ్రతుకిం
దేలా విచారింపఁగన్.

అని యెన్నియో జితేంద్రియత్వమును గూర్చిన మహావిజ్ఞానవిషయములును గూడ వ్రాసినాడు. ఈతఁడెప్పుడును ఆసవపానాది దుర్విషయములుగాని కామినీప్రసక్తిం

పానాది విషయలంపటుఁడుగాని కాఁడని చరిత్రజ్ఞులు వ్రాయుచున్నారు. ఔరంగజేబు తనగ్రంథమును, హాఫేజు (ఈతఁ డొకసుప్రసిద్ధుఁడైన పారసీకకవి.) ప్రబంధమును దేశస్థు లెవరును చదువరాదని నిషేధించినాఁడు. జేబున్నిసా (ఔరంగజేబుకుమార్తె) ఈగ్రంథముల నిరంతరము పారాయణము సేయుచుండెడిది. ఈవిషయమునుగూర్చి ప్రజ లౌరంగజేబునడుగ మీరవి యర్థముచేసికొన గలిగితిరేని చదువవచ్చునని చెప్పపంపినాఁడు. దీనినిగూర్చి అగ్బరు చక్రవర్తితనఅయినీఅగ్బరీ అనుగ్రంథములో మిగుల ప్రశంసించి యీ మహాగ్రంథములోని యుద్విషయము లనన్యసామాన్యములు; ఎల్లవారు గ్రహించుటకు సాధ్యముగావు: వ్రాసినాఁడు. మొత్తముపై నీ పొత్తము చదువుచున్నంతసేపు మనస్సును చాల ఆకర్షించుచుండును. రసస్వరూప మెదుట తాండవమాడుచున్నదాయని తోఁచకమానదు. ఇట్టిపరివర్తన మింకొకగ్రంథమువలన సేరదు.

---

# కీరమా!

నాళము కృష్ణారావుగారు

"ఏచటి కేఁగెదు? కీరమా! యిందు రమ్ము
ఏటి కాయాసపడెదవు ఎగిరి యెగిరి?
పసిఁడితీఁగలఁ గూర్చిన పంజరంబు
వ్రేలఁగట్టితి, నల్లదే! వ్రాలు మందు.

దోరపండిన నునుపారుదొండపండ్లు
పరువమొందిన తీయని పనసతొనలు
కుడువఁబెట్టెద నిచ్చలు కడుపునిండ
ఆరగింపుము కీరమా! హాయి మీఱ"

"మోదమందితి బాలరో నీదుదయకు
డంబు మీఱిన నీపంజరంబుకంటె
మఱ్ఱిమ్రాకున నలరారు తోఁటలోని
నాదువెచ్చనిజిగిగూఁడె నాకు హితము

తఱపివెన్నెలలందలి తళతళలును
మించునునుమంచుబిందుల మిలమిలలును,
కమ్మతెమ్మెరలందలి గమగమలును
విడిచి, నీయింట కడగండ్లు బడఁగ నేల?"

"మండుటెండల మలమల మాఁడిమాఁడి,
వానసోనలఁ బలుమాఱు నాని నాని,
మంచుబిందుల మాటికి మాఁగి మాఁగి
కడిఁదిసీతున వడవడ వడఁకి వడఁకి

గాసి నొందఁగ నేటికే గండుచిలుక?
మంజులంబగు నాపైఁడిపంజరమున
కొంతకాలము తల దాచికొనఁగరాదె?
ఇచ్చ గలదేని పిదప పోయెదవు కాని."

"మండుటెండలు వానయు మంచు సీతు
మీకు మనుజులకే కాని మాకుఁ గలవె"
స్వచ్ఛతర మగు నిర్మలవాయువులను
స్వేచ్ఛమీఱ విహారంబు సేయుచుందు.

మంచుమలలందు నొకసారి మలయుచుందు
జలదపంక్తుల నొకమాఱు చొక్కళింతు
సాగరముమీఁద నొకపరి సంచరింతు;
పులుఁగులగుమాకుఋతుభేదములును గలవె"

"గిరుల, మబ్బుల, నంబుధిఁ దిరుగునపుడు
త్రోవ తప్పి భ్రమింపవే తోడు లేక?
చిన్నచిలుకరో! నీ కిట్టి సిలుగు లేల?
చెలఁగి నాయండ నెపుడు వసింపరాదె?"

నోరు లేనట్టి పసుపక్షివారములకుఁ
దోడుపడు నెవ్వఁ డాతండె త్రోవ సూపు;
కిరణములఁ జిమ్మి, జిగిమబ్బుపొరలఁ జించి
లీల విహరింతు నిచ్చమై గాలి వ్రోలె.




# శ్రీనాథ కవిరాజీయము

కవిరాజ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి గారు

(వెనుకటి సంచిక తరువాయి)

వీరభద్రారెడ్డి

ఇదిగో నిటఁ దమలపాకు లమ్ముచున్నది; దీనిం జూచి తమలపాకులు బేర మాడి రమ్ము.

(శ్రీనాథుఁడు పోయి వచ్చును.)

వీరభద్రారెడ్డి

రసికాగ్రగణ్యా! తమలపాకులదానిం జూచి వలచితివా యేమి? పెక్కుమాటలు సాగించితివి.

శ్రీనాథుఁడు

(నవ్వుచు)

"చ. తొలకరిమించుఁదీప గతి
దోఁప దుకాణముమీఁద నున్న యి
య్యలికులవేణితోఁ దమల
పాకులబేరము లాడఁ బోయి నే
వలచుట కేమి శంకరుని
వంటిమహాత్ముఁడు లింగరూపియై
కులుకుమిటారిఱొమ్మునఁ బయిఁ
గోరిక లీరిక లెత్త నాడఁగన్."

వీరభద్రారెడ్డి

శ్రీనాథా! నీ కెంత సాహసమున్నదో చూతము! చెంగావిచీర గట్టుకొని పోవునీపూవుఁబోఁడిం గిలిచి మాటాడుదము.

శ్రీనాథుఁడు

"సీ. సొగసు కీల్జడదాన! సోఁగకన్నుల దాన
వజ్రాలవంటి పల్వరుసదాన!
బంగారు జిగిదాన! బటువుఱొమ్ములదాన!
నయమైన యొయ్యారి నడలదాన!
తోరంపుఁగటిదాన! తొడల నిగ్గులదాన!
పిడికిట నడఁగు నెన్నడుము దాన!
తళుకుఁజెక్కులదాన! బెళుకుముక్కరదాన!
సింగాణి కనుబొమ చెలువు దాన!
మేలిమి పసిండి రవకడియాలదాన!
మించి పోనేల రత్నాల మించుదాన!
తిరిగి చూడవె ముత్యాల సరులదాన!
చేరి మాటాడు చెంగావి చీరదాన!"

వీరభద్రారెడ్డి

కవిరాజా! కవులు తమ స్వభావ మెట్టిదైనను సమయానుకూలముగఁ బ్రవర్తింపనేర్తు రనుటకు నీయిప్పటి శృంగారవర్ణనమే సాక్ష్యమిచ్చుచున్నది. నీవు మహానుభావుఁడవు; సకలవిద్యాపారంగతుఁడవు. బ్రహ్మజ్ఞాననిష్ఠాగరిష్ఠుఁడవు. నిన్నెవరేవిధంబునఁ దలంచిన నేమిలోపము! మహాకవీ! మన మిట వచ్చి చాలకాలమయినది. గంగాదర్శనము చేసి

మార్కండేయేశ్వరు నారాధించి నగరునకుం బోవుదము రమ్ము.

శ్రీనాథుఁడు

దేవరవారియాజ్ఞ.

(ఇద్దఱు నడచుచున్నారు.)

(అపటీక్షేపంబునఁ బుష్పగిరిక్షేత్రంబును, గౌతమీనదియు, మార్కండేయేశ్వరాలయంబును గానిపించును).

శ్రీనాథుఁడు

(గంగదక్కు మొగంబై చేతులు జోడించి)

శా. శైవాగ్రియజటానవస్కరమహా
స్థానంబునం బొల్చి వే
ధోవిద్రోరుకమండలూదరమునం
దు న్నిల్చి విష్ణ్వంఘ్రిరా
జీవంబందుఁ దలిర్చి భూమిగతవై
చెన్నారు నోగౌతమీ
దేవీ! సేవ యొనర్తు దీనుని ననుం
దీపింపఁగాఁ జేయవే.

(రాజుదక్కు మొగంబై) రాజా! యిప్పద్మాద్రిం దిలకింపుము.

మ. కల దిద్వ్యోటఁ గృతాదికాలమున లో
కప్రస్తుతంబై మునీ
ట్కలితంబై యమృతంపుఁగుండము మహా
కల్పంబునం బైనఁ ద
జ్జల మారర్ మృతి లేక జంతుతతి హె
చ్చర్ దానిపైఁ దమ్మిపూ
పొలుపుం గాంచినకొండఁ బెట్టి రమరుల్
ప్రోలింతె భూపాలకా!

ఈ పుష్పగిరి వరంబు—

మ. అవలర్ నాశికనుండి సాగరమునం
దాంతర్యతం బొందుదా
కినర్ ప్రేలుచు భూపురంధ్రిగళమం
దింపారుము త్యాలపే
రవు నా గౌతమి వొల్చుదాని తరళం
బై పద్మభూభృద్వరం
బవిత్రబ్రాహ్మణతోకమై వెలయు లో
కాధీశునాస్థానమై.

(రాజుతో నించుక నడిచి మార్కండేయేశ్వరుం దర్శించి చేతులు జోడించుకొని)

మ. ఉదితక్రోధముతోడఁ బ్రాణపవనం
బుట్టూఁతలూఁగింప ను
న్మదుఁడై వచ్చినదండపాణి నెదురర్
దర్శించి దైన్యంబునర్
బదియాఱేఁడులబాలుఁ డయ్యు నెడఁనం
బ్రార్థింపఁ దజ్జీవన
ప్రదుఁడై పొల్చినశర్వునిం గొలుతు మా
ర్కండేయనామేశ్వరుర్.

వీరభద్రారెడ్డి

(స్వామికి నమస్కరించి కవిరాజుం గాంచి) కవీంద్రచంద్రమా! నేఁడు మనరాజమహేంద్రపట్టణము చుట్టి చూచితిమి గదా! ఇది నీ కెట్టిమనోరథంబు పుట్టించినది? ఇదియెట్టిప్రభావము గల దని తోఁచినది? చెప్పుము.

శ్రీనాథుఁడు

రాజేంద్రా! చెప్పెద నవధరింపుము.

ఉ. రాజమహేంద్రుకాలమున
వ్రాసెను నన్నయభట్టు భారతం

భోజమెయిం దదాదిగ
మహోన్నతిఁ దెగ్గది జన్మభూమికా
రాజిలు నిష్పధుర్గ సుకవి
రాజసమంచితమై తలిర్చుటన్
రాజమహేంద్ర మొప్పెసఁగు
నాఁటికి నేఁటికి సాటి లేనిదై.

వీరభద్రారెడ్డి

నీ కానందసంధాయక మగుటయే మా కానందము కవీంద్రా! మన మింక నగరునకుం బోవుదము రమ్ము.

(ఇద్దఱు నిష్క్రమింతురు. తెరపడును).

అంకాంతము

---

స్థలము — ఆస్థానము

[వేమారెడ్డి, వీరభద్రారెడ్డి, అన్నామాత్యుఁడు, శ్రీనాథుఁడు, పురోహితుఁడు, ప్రవేశము.]

వేమభూపాలుఁడు

కవిరాజా! కృతిగ్రహణంబునకు ఋషిప్రోక్త కల్పంబు గలదా? తద్విధాన మెట్లు?

శ్రీనాథుఁడు

కృతిగ్రహణంబునకు ఋషిప్రోక్తకల్పంబుగలదు. "ఆదౌ పూజ్యో గణాధిపః" అనుటంజేసి గణపతిపూజం గావించి, పిదప నవగ్రహారాధనంబును, అష్టదిక్పాలకపూజయుం గావించి, యనంతరంబ కలశస్థాపనంబుచేసి, యందు గ్రంథముం బ్రతిష్ఠించి, సరస్వతింబూజించి, మంగళతూర్యంబులు మ్రోయుచుండ నా గ్రంథము కృతికర్త కృతిభర్తహస్తయుగంబునం బెట్టుటయు నందలి కృతిపద్యము లొండు రెండు చదువుటయు దానివిధానము.

పురోహితుఁడు

ప్రభువర్యులారా! సుముహూర్తము సమీపించినది. ఆజ్ఞకుఁ బ్రతీక్షించుచున్నవాఁడ.

(వేమభూపాలుఁడు అన్నామాత్యునిం దిలకించును).

అన్నామాత్యుఁడు

బ్రాహ్మణోత్తమా! శాస్త్రోక్తక్రమంబునఁ బూజం గావింపుము.

(పురోహితుఁడు శ్రీనాథునిచేతినుండి పుస్తకముం బుచ్చుకొని మంటపముపైఁ బెట్టి పూజించును).

(శ్రీనాథుఁడు కాశీఖండమును బూజాస్థానము నుండి పుచ్చుకొని వేమారెడ్డిదిక్కు మొగంబగును).

వేమభూపాలుఁడు

సార్వభౌమా! ఆంధ్రమహీమండలాఖండలుం డైన వీరభద్రభూపాలునకుఁ గృతి సమర్పించి కృతార్థుండ వగుము.

(శ్రీనాథుఁడు వీరభద్రారెడ్డి సమ్ముఖమ్మునకుం జని వాని హస్తయుగంబున గ్రంథముం బెట్టును. కరతాళధ్వనులు మంగళతూర్యములు మ్రోఁయును).

అన్నామాత్యుఁడు

కమలనాభపౌత్రా! నీవు ధన్యుఁడవు. శ్రీమహావిష్ణుతుల్యుం డయిన మా రాజేంద్రునకుఁ గృతి సమర్పింపఁ గలిగితివి.

వేమభూపాలుఁడు (శ్రీనాథునకు రత్నాంబరంబు లర్పించును).

అన్నామాత్యుఁడు

కవీంద్రా! కృతిసమర్పణ పద్యములు చదువు దువా?

శ్రీనాథుఁడు

చిత్తము. మహామాత్యుల యాజ్ఞ!

(రాజుచేతిలోని పుస్తకమును బుచ్చుకొని వాగ్దేవిం బ్రార్థించి)

"శా. శ్రీకాశీనగరాధిరాజ్యపదవీ
సింహాసనాధ్యాసి లో
కైకగ్రామణి విశ్వనాథుఁడు విశా
లాక్షీ మనోభర్త సు
శ్లోకుం దొడ్డయయల్లభూవరు తనూ
జుః వీరభద్రేశ్వర
క్ష్మాకాంతుం జగనొబ్బగండని మహైశ్వ
ర్యాన్వితుం జేయుతన్."

"క. గజదళ విభాళబిరుదున
కజగవధరభక్తి భావితాత్మునకు సమి
ద్విజయునకు రాయవేశ్యా
భుజగునకును వీరభద్రభూపాలునకున్."

"వ. అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నాయొనర్పం బూనిన కాశీఖండంబు."

"మాలిని. వికచకమలనేత్రా! వేమమాంబాసు
పుత్రా!
సకలనృపశరణ్యా! సంశ్రితాశేషపుణ్యా!
మకరనిధిగభీరా! మానినీచిత్తచోరా!
ప్రకటగుణతరంగా! రాయవేశ్యాభుజంగా!"
"స్వస్తి"

(చదివి మరల పుస్తకము రాజు హస్తములం దుంచును).

వీరభద్రారెడ్డి

(పుస్తకము మరల శ్రీనాథున కిచ్చి) అగస్త్యులు కాశిం బెడఁబాయునట్లు రెండు పద్యములు చదువుము.

శ్రీనాథుఁడు

"సీ. పరమకళ్యాణి! యోభాగీరథీ! గంగ!
వార్ధిభామిని; పోయివత్తు నమ్మ!
యమకేంద్రులార! లోలార్క- కేశవులార!
వనజసంభవ! పోయివత్తు నయ్య!
శ్రీవిశాలాక్షి! దాక్షిణ్య పుణ్యకటాక్ష!
వాసవార్చిత! పోయివత్తు నమ్మ!
శ్రీపూర్ణభద్రపారిషదనాయకులార!
వటుకభైరవ! పోయివత్తు నయ్య!
తీర్థసంవాసులార! కృతార్థులార!
పాశుపతులార! భాగ్యసంపన్నులార!
మందిరోద్యానవాటికామరములార!
పోయివత్తును మీ కాశిపురము విడిచి"

"సీ. కలహంసి రారాదె కదలి నాతోఁ గూడి
నీవేల వత్తమ్మ నెమ్మి నుండి
కదళీకాకాంతార! కదలి రా నను గూడి,
నీవేల వత్తమ్మ నెమ్మి నుండి
శ్రీవిశాలాక్షి! విచ్చేయు నాతోఁ గూడి
నీవేల వత్తమ్మ నెమ్మి నుండి
నాతోడఁ గూడి యంత గ్రహ! యేతెమ్ము
నీవేల వత్తమ్మ నెయ్య నుండి
రండు నను గూడి యోపరివ్రాట్టులార!
వత్సలత గల్గి మీ రేల వత్తు రయ్య!
పరమనిర్భాగ్యుఁ డైననాపజ్జ వట్టి
కటకటా! సౌఖ్యజలరాశిఁ గాశిఁ బాసి."

వీరభద్రారెడ్డి

ఆహా! నీకవిత్వ మనన్యసులభ మమృతప్రవాహము. నన్నయతిక్కనాదులును నీకుఁ దక్కువ యనియే నాయభిప్రాయము.

అన్నామాత్యుఁడు

మేలు మేలు. మహారాజా! మేలు మేలు. మముబోంట్లమాట మాట కాదు. విద్వత్ప్రభువులమాట మాట. మీరు మెచ్చుట లోకత్రయంబు మెచ్చుట యని నాసిద్ధాంతము.

వేమభూపాలుఁడు

గౌడడిండిమభట్టు నోడించిన వీనిపాండిత్యమును, నైషధకాశీఖండంబులం దెలిఁగించిన వీని కవిత్వమును మెచ్చుకొననివాఁ డెచ్చట నైన నుండునా?

శ్రీనాథుఁడు

ప్రభువర్యులయనుగ్రహము కాని నేను సామాన్యుఁడను.

వేమభూపాలుఁడు

శ్రీనాథా! గాంధర్వకవిత్వములు పుట్టుకతోడం బుట్టునవి యందురు. చదువుకొనినఁ గవిత్వము చెప్ప లేనివాఁ డుండునా? పాడ లేనివాఁ డుండునా?

శ్రీనాథుఁడు

దాని కర్థ మిట్లు కాదు. రెండు కూనిరాగములు తీయుట సంగీత మనియు, గురులఘుజ్ఞానము గలిగి రెండు గీతలు గీయుట కవిత్వ మనియుఁ దలంపరాదు. ఆపాతమధురమైన సంగీతమును, ఆలోచనామృతమైన కవిత్వమును బురాకృత కర్మపరిపాకంబునం గలుగునవి కాని సామాన్యములు కావు.

వేమభూపాలుఁడు

చతుర్విధాంధ్రమున గ్రామ్య ముపయోగించు కొన నొప్పదా? అది వ్యవహారబద్ధము కాదా?

శ్రీనాథుఁడు

వ్యవహారము దేశమునకు గ్రామమున కొక విధము. శాసనము లేనిభాష సర్వజనైకవేద్యము కాదు. కావున గ్రామ్యము నింద్య మనియే మహాకవులసిద్ధాంతము.

వేమభూపాలుఁడు

గ్రామ్యకవిత్వ మెట్లుండునో విన నభిలషించుచున్నవాఁడ.

వీరభద్రారెడ్డి

(శ్రీనాథుం జూచి) నిన్న మనము వీధినాటకమునఁ జూచియున్న కవులం బిలువ నంపి తెప్పించినవారిమహారాజునభిలాషం దీర్పఁ గల రని తలంచెదను, (అన్నామాత్యునిం జూచును).

అన్నామాత్యుఁడు

ఎవ రక్కడ?

భటుఁడు

(ప్రవేశించి) అమాత్యశిఖామణీ! ముదల యేమి?

అన్నామాత్యుఁడు

నీవు పోయి ధర్మశాలలో నున్న వైదేశికులం దీసికొని రమ్ము. పొమ్ము.

భటుఁడు

చిత్తము.

(నిష్క్రమించును)

శ్రీనాథుఁడు

వేమభూమీశ్వరా! గ్రామ్యకవులు మూఁడు తెఱంగులై యున్నవారు. లోకములో జనులు

వ్యవహరించునట్లు గద్యపద్యము లల్లువారు. భావకవిత్వము లని కొంత వ్యావహారికభాషం జేర్చి కవిత్వము చెప్పెదు మనువారు. నీచాతి నీచభాషతోఁ బాటలు పదములు నల్లువారును.

వేమభూపాలుఁడు

ఇది భావకవిత్వ మన నర్థ మేమో నాకుఁ దెలిసినది కాదు. భావము లేనికవిత్వ ముండునా? ఉన్న నది కవిత్వమా? భావకవిత్వ మని యొక తెగకుం బేరు పెట్టుట యేమి?

శ్రీనాథుఁడు

ఈభావము దేవర యూహించెడుభావము కాదు. ఈభావ మెట్టిదో యిప్పుడే విందురు గాక.

(అంత బైఁ జెప్పినమువ్వురు కవులును బ్రవేశ పెట్టఁబడుదురు).

(అన్నామాత్యుఁడు వారిని విశ్రమింప నియోగించును).

గ్రామ్యకవి

దేశభాషల్లో కవిత్వం చెప్తే దేశీయులకి తెలుస్తుం దని చెప్పి లట్లు వ్యావహారికభాషలో గ్రంథా లుంటే సర్వజనులకీ సుబోధకంగా వుంటుం దనిన్నీ చచ్చి కుళ్లినడొక్కల్లాగున్న మృతభాష పనికి రాదనిన్నీ, దాంతో గ్రంథాలు చెయ్యడం పాప మనిన్నీ, ఆపాత్తెనుగుతో గ్రంథాలు రాస్తే పిల్లాళ్లులర్థం చేసుకోలేక నానాచిక్కులూ పడి వ్యర్థులై పోతా రని, అల్లా శాసనాలు పుట్టా లని నేను పదిపదిహేను సంవత్సరాలనుంచి భగీరథప్రయత్నం చేస్తూ వున్నాను. నామానప్రాణధనాలు గీనికే విని యోగిస్తున్నాను. పలినవా రనుగ్రహానికి ప్రతీక్షిస్తున్నాను. నేను కోరేది శాసనాల్లో వుండే మాటలు పాత్తాటాకుపుస్తకాల్లో వుండేమాటలే కాని మరోటి కావు. ఇంతే నావిన్నపం.

వేమభూపాలుఁడు

గ్రామ్యవాదీ! పద్యము కూడ గ్రామ్యములో నుండవలయు నందువా? వచనములో మాత్రమా?

గ్రామ్యకవి

రెంటియందున్నూ.

వేమభూపాలుఁడు

ఏదీ చూతము. గ్రామ్యములో నొక్కపద్యము చెప్పుము.

గ్రామ్యకవి

క. చెబితే గ్రామ్యకవిత్వం
పెబు లందరు మెచ్చఁ జెప్ప వాలది కాదా
ఉబు సెందుకు ప్రార్కొ వలె
సబలోపల మెచ్చు యెంచు సత్కవియైతే.

అందఱు

(నవ్వుచుఁ గరతాళధ్వనులు చేయుదురు).

వేమభూపాలుఁడు

మేలు మేలు గ్రామ్యవాదీ! మాపండితు లందఱు నిన్నుఁ జూచి కవిత్వము నేర్చుకోవలసినవా రగుచున్నారు.

అన్నామాత్యుఁడు

నీగ్రామ్యకవిత్వలక్షణము తెలిసినది. నీవు విశ్రమింపుము. (భావకవిదిక్కు మొగంబై) ఓయీ! నీభావకవిత్వప్రభావ మొక్కసారి వినిపింపుము,

భావకవి

భావకవిత్వ మన్న సామాన్యము కాదు. సామాన్యులకు మాకవిత్వములోని భావము తెలియుట దుర్లభం. అది యిప్పటివారికి తెలియక పోయినా ముందువచ్చేవారికి తెలియక పోదు. ఆఫల మపేక్షించే మే మిట్లుద్యమించినాము.

వీరభద్రారెడ్డి

ఒక్క పద్యము చెప్పుము. విని యానందించెదము. దానిభావము మాకుఁ దెలియకున్న మాపండితులకైనం దెలియకుండునా? అట్లు తెలియకున్న నీవే చెప్పి నీభావము వెల్లడింతువు గాక.

భావకవి

చిత్తము, చిత్తము, చిత్తగింపుఁడు.

చ. చిలుకలు చెట్లకొమ్మలవ
　సించి కుహూ యని యాటలాడు కో
కిలములు కావు కావు మని
　కేకలు వైచెడు కొండ లెక్కి కో
తులు కయిసేసి సింగములతో
　సరసంబులు సంతరించు ని
క్కలియుగరాజుకున్ సకల
　కాలము జాలిని గోరి దీర్ఘతన్.

వేమభూపాలుఁడు

భేషు! భేషు! భావకవీ! భేషు! భేషు! నీవు చెప్పినట్లే నీభావము మాకు స్ఫురించినది కాదు. నీవే చెప్పి మ మ్మానందింపఁ జేయుము.

భావకవి

తనకవిత్వమునకు తానే వ్యాఖ్యానముచేయుట తప్పని చెప్పుదురు. అట్లే నాకవిత్వమునకు నేనే భావము చెప్పుట తప్పే యగును. కావున నేఁ జెప్ప రాదు.

వేమభూపాలుఁడు

కవిసార్వభౌమా! దీనిభావము నీవుచెప్పగలవా? ఇందు భావమున కభావమే యని నాభావము

శ్రీనాథుఁడు

అట్లనుట న్యాయ్యము కాదు. ఇట్టి భావార్థంబులు తొల్లియుం గలవు. ధారానగరాధీశ్వరుం డగు భోజరాజు రాజ్యము సేయుకాలమున నొక్కనాఁ డొక్క తిలఘాతుకు నలంకరించి కాళిదాసుఁడు రాజదర్శనంబు సేయించె. రాజు నమస్కరింపఁగా వాఁడు అశ్వనీ, పునర్వసూ, కృత్తికా, రేవతీ, యని యాశీర్వదించినాఁడు. రాజు వాఁడు మూర్ఖుఁ డని గర్హించుచుండఁగాఁ గాళిదాసుఁడు రాజా! దీనిభావ మతిగంభీరము. ఆలకింపుము. "శ్లో. అశ్వనీ భవతు భూప మందురా, మందిరే భవతు తే పునర్వసూః; కృత్తికాతనయవిక్రమోస్తు తే, రేవతీపతికనిష్ఠసేవయా" అని వీని యభిప్రాయము. అని చెప్పినాఁడఁట! అట్లే యీ భావకవియును. దీనిభావం బాలకింపుఁడు.

కలియుగరాజుకున్ = కలియుగములో రాజైన వీరభద్రరాజునకు, సకలకాలము = ఎల్ల కాలము జాలినిగోరి = కరుణతోడనని యర్థము ధ్వని; దీర్ఘతన్ = దీర్ఘత్వముగా; అనఁగా దీర్ఘాయుర్దాయమును జెప్పుకో వలయును; మఱియు నిందు కలి; యుగ, రాజ, కల, కాల, జాలి, గోరి, వీనికి నానార్థములు కలవు. ఏయర్థము కావలయు నన్న నా యర్థము చెప్పుకొనవచ్చును.

చిలుకలు=చిలుకలవంటి స్త్రీలు, చెట్ల=దండల యందు; వసించి=ఉండి; కుహూ యని పలుక రించుచు నాడుదురు; అనఁగా సుందరస్త్రీల పొందిక కలుగుఁ గాక యనియు, కోకిలములు= పరభృతములు, పగులు శత్రువులు; కొండ లెక్కి యనఁగా నిలిచి యని యర్థము. కావు కావుము = రక్షించు మని మొఱ్ఱ పెట్టుదురు. అనఁగా శత్రువులు వశు లగుదు రనియు; కోతులు=కోతిపనులు చేయువాండ్రు పిల్లవాం డ్రు; కయిసేసి = అలంకరించుకొని లేక చేతు లలో నాడుకొనువారై సింగములతోఁ= ప్రభువులతో; సరససల్లాపము లాడుదురు. అనఁగాఁ బుత్రపుత్రికాసంతానము కలుగుఁ గాక యనియు నాశీర్వాదము.

అందఱు

బళిబళీ! బళిబళీ! (అని కోలాహలము)

వేమభూపాలుఁడు

ఇక్కడికి భావకవిత్వభావము తెలిసినది. ఇంక మూఁడవది తరువాయి యున్నది. తత్ప్రభా వముగూడ వినఁ దలంచితిని.

పదకవి

(సంగీతముతో)

౧ ఎల్లి! రావే జాజిమల్లి రావే; మల్లీ మల్లీ
(వొచ్చి) వొళ్లోనూ గూకుండ॥ ఎల్లి

౨ నీతోనే గూకుంటే నిన్నే సూసూసుంటే,
నాపానా మింతాలా లేసీ వస్తా దోసి॥ ఎల్లి

3 సంతాకీ ను వ్వోయి సనములో వచ్చినా,
యింతాలో నామడుసు యిం కొక్కయిద
[మూద్ది॥ ఎల్లి

ర నువ్వే నేనూ నేనే నువ్వూ నీపానామూ,
నాపానా మొక్కో టే సూపేరులే కాని॥
[ఎల్లి! రావే॥

అందఱు

మేలు. మేలు! బళిబళీ! (అని కరతాళధ్వనులు)

వేమభూపాలుఁడు

ఇక్కడికి మూఁడు ముత్తెలంగుల గ్రామ్యమును దెలియవచ్చినది. ఇట్టియపాత్రపు గ్రామ్యము నకుఁ బాత్రత గలిగించి విద్యాధికారు లగు వారే కొందఱు మందమతులై గ్రామ్యవాదుల గౌరవించుచున్నారు. ఈ గౌరవించుట కఱ కుక్కను గంగిగోవుం జేయుటయే. గ్రామ్య వాదీ!నీకవిత్వ మెత్తుకోలు మొత్తికో లను నట్లు న్నది. నీవాదము దుర్వివాదము. భావకవీ! నీభావకవిత్వము నేతిబీరకాయ వంటిది. నీకవి త్వములో భావమే లేదు. నీకు గణయతిప్రాస లక్షణము కొంచెము తెలియునేకాని నీవు పండి తుఁడవు, కవివింగావు. నీ కవిత్వము పైత్యము. గీతకవీ! లోకములో నీపాడు కవిత్వము ప్రస క్తికిఁ దెచ్చుటకన్న దరిద్రము మఱియొక్కటి లేదు. ఇది బూతుబూంతైన జావళీ కవిత్వము కన్న నధమము. అధమాధమము. (మంత్రి దిక్కు మొగంబై) మంత్రివర్యా! ఇట్టి గ్రామ్య ము దేశమునఁ బ్రబలఁగూడ దనియు దీనిం బ్రసక్తిం దెచ్చినవా ర్లెల్ల శిక్షార్హు లనియు నొక్కశాసనము సృష్టించి, ఇప్పు డున్నట్టి గ్రామ్యగ్రంథము లన్నియు నశింపఁ జేయవల యునని శాసించుచున్నవాఁడ.

అన్నామాత్యుఁడు

(గ్రామ్యవాదులం జూచి) మీరు భాషాద్రోహులు. భాషాద్రోహి దేశద్రోహి నాఁబడు. మీరు శిక్షార్హులు. మిమ్ము శిక్షించుట న్యాయశాస్త్ర సమ్మతమే.

అయినను మీరు బ్రాహ్మణులు కావున నిది మొదటితప్పుగా నెంచి మిమ్ముఁ గరుణించి పుచ్చినారము. మీ రింక నిట్టి కవిత్వమును బ్రసక్తికిం దెచ్చితిరేని రాజశాసనం బెట్లు చేయవలయునో మీరే తెలిసికొనుఁడు. పొండు, బుద్ధిగలిగి మెలఁగుఁడు.

గ్రామ్యవాదులు

(అధోముఖులై లేచి నిష్క్రమింతురు).

(తెరలో ఘంటలు)

వేమభూపాలుఁడు

మధ్యాహ్నకాల మయినట్లు ఘంటలు మ్రోయుచున్నవి. నేఁటి కీకొలువు చాలింతము.

(అని లేచును).

[అందఱు లేచి నిష్క్రమింతురు]

అంకాంతము



# ఆనవాలు

పల్లెపూర్ణ ప్రజ్ఞాచార్యులు గారు

ద్విపద

౧

శ్రీ యాధికారంబు చేమత్తుఁ డగుచు
న్యాయంబు విడి యక్షనాయకు చేత
పడాది, ప్రియురాలి నెడఁబాయు మనుచు
వాడియౌ శాపంబు వడసి యద్దాన
తనదు సామర్థ్యమంతయుఁ గోలుపోయి
వనట యక్షుండు ప్రవాసియై యొకఁడు
శ్రావణమాసంబు సన్నిధియగుడు
జీవితేశ్వరిని సజీవఁగాఁ జేయ
సేమంపు వార్తను జీమూతువలనఁ
గోమలికింబంప గోరి యీరీతి
అలకా పురంబునం దలరారు తనదు
నిలయంబు నెఱుఁగ వర్ణింపంగఁ దొడఁగె.

౨

ధనపతి మందిరోత్తర భాగమందు
అనతిదూరమున నే యలరు మద్గృహము
దానిచుట్టును శక్రధనువు నాఁగోట
కానసౌ మఱినీకుఁ గనులఁపండువుగ,
చేతికందెడు పూలచెండ్లచే వంగి
నాతన్వి పుత్త్రి మన్ననఁ బెంపఁ బెరిఁగి
దీపించు నీకు గుర్తింప నాకోట
దాపున బాలమందార వృక్షంబు.

మసృణ వైదూర్య సమంచితనాళ
విస్ఫురహేమాబ్జ వికసితం బగుచు.
వాపి యొక్కటి యందు వరలు మారకత
సోపానపంక్తులఁ జూడనై యొప్పి
అందు వసించు రాయంచను నిన్ను
ముందు వీక్షించియు, మోసాలనున్న
మానసంబున కేఁగి మానవచ్చు నంచు
మానసంబున నేని మఱియొంచ వెపుడు.

3

రుచిరేంద్ర నీలోరు రోచిరంగాళి
విచికిల శిఖరమై వింతగొల్పుచును.
కనకరం భావనాక్రాంతమై జలద!
తనరుఁ గ్రీడా పర్వతంబు తత్తటిని.

మిత్రమా! నాదు భామిని కదిప్రేమ
పాత్రమౌటను "బదేపదె" చెప్పనేల?
నినుఁదటిత్సౌందర్యనియుఁ జూచుడును
మనసున కది మఱిమఱి జ్ఞప్తివచ్చు
జలద! యాకృత్రిమ శైలంబునందు
విలసిల్లు నొకమాధవీ మండపంబు
దానిచెంగటఁ జలద్దళ మశోకంబు
మానైన పొగడయు మఱికానుపించు
ఆ రెంటు నెపుడు దోహదకైతవమునఁ
గోరెడు, సనుఁబోలెఁ గోమలికూర్మి
ఒకటి తద్వామపాదోరుతాడనము
ఒకటి తన్ముఖమదిరో పానసంబు.

4

రవ్వల పీటతో రాజిల్లు పైఁడి
మవ్వంపు గడ,వాని మధ్యఁ జెన్నారు
పచ్చి వెదుళ్లతోఁ బల్లటీలాడు
పచ్చరా యరుగు కస్పడు దానిక్రింద
ఘులుఘుల్లుమని పైఁడి గాజులుమ్రోగ
లలిఁదాళములను మల్లలన యాడింప
ముదమొందు నీమిత్రముఖ్య మానెమలి
నిదురించు గజనుల నిత్యమాగడను.

గుఱితు వేరొక్కటి గూడఁ జెప్పెదను
మఱవీని మదిలోన మఱవకు మయ్య,
కలవు వాకిట నిరుగడలఁ గుహ్యముల
సలలితగతి వ్రాసి శంఖపద్మములు
నాయెడఁ బాసిన నాఁటనుండియును
ఏయుత్సవము లేక యొసఁగుట కతన,
దేజంబు చెడి యిల్లు దీపింపకుండు
రాజిల్లునే తమ్మి రవి నెడఁబాసి.

---

## నా జీవితనాటకము

బసవరాజు వెంకటప్పారావుగారు, బి. ఏ., బి. యల్.

కపటనాటకాల నే నింకనాడ, లేను, తెరదించుడీ, కొరగాని నాలి
వేసములవేసి పొట్టకై మోసగించి, పరుల లాలించి యాచించి బతకలేను!
గీ. పుట్టినట్టి పౌరుషమైన పుటక మరిచి, పరుని కృతికి వేసముగట్టు పాపమేల?
నా విధురజీవితమ్మునే నాటకమ్ము, జేసి, ఆడించి, జగతి రంజింపలేనో?



# కొత్తపల్లి సూర్యారావుగారు

(వెనుకటిసంచిక తరువాయి)

## ఏడవయంకురము

వివాహమునంతటి సంతోషసమయ మేదియు లేదని స్థూలదృష్టికిఁదోఁచి నలువురు నానందింతురుగాని సూక్ష్మదృష్టిని విచారించిన నంతటి పెద్దవిచార మేసమయములో నెన్నఁడును గలుగదు. మగవానికి నాఁడుదానికి నిదియొక్క పెద్ద బెడదవచ్చి మీఁదఁబడుటయే—దశాంతరమునకు మాఱుటయే—బాల్యాదిదశలుమాఱి గృహస్థాశ్రమమునకుదిగుట మాటలతో నున్నదా! సంసారము మాకు వలదోయితండ్రీ! యని యొక్క నమస్కారముచేసి, శాస్త్రవేత్తలు గృహ్యసూత్రములు రచియించి మనుష్యులకు ద్వంద్వానురాగమునకు దారిచూపిన సర్వజ్ఞులు, మౌనులై యడవులఁబడిపోవుట— దీనికర్థమేమో యాలోచింపవలసినదే. సంసారమును భరించుటయనఁగా మీఁద నుండి పడుచున్న యాకాశమును బ్రహ్మాండముయొక్క పైడిప్పను దలఁపైఁబెట్టుకొని మోయుచుఁ గష్టభారమును లక్ష్యముచేయక— తల కెండవగలుట లేదు. వానచినుకులు మీఁదఁబడుట లే-దని సంతోషించుటవంటిదే కాదా! ఇప్పటికి మనవారిలో నెందఱో వందలు గడించుచున్నవారు కూడ నెట్లు సంసారమును భరింతుము — సంసారమనఁగా భార్యయేపరమార్థము— భర్తయనునామమును మేము భరింపలేము. భార్యనెట్లు భరింతుమని చివరి విధిలేక యున్న జంజాటమునువిడిచి యదాయదలు చేయలేక వృద్ధులగుజనకులఁ బోషింపను మాత్రము పనికిరాని కుమ్మరపురువులవలె సంచరించుచున్నారు. 'పెండ్లి, నాకుఁబెండ్లి, నాకు భార్యవచ్చును, నాకుమగఁడు, నగలు వచ్చునను సుబలాటము, బిడ్డలఁగందు'మను పెద్దయుత్సాహము— వెఱ్ఱిసంతోషము — ఇందుకనియే, జ్ఞానమువచ్చినపిమ్మట, నొక్కమాఱనుభవించుసంసారులంగాంచి యేమని మతిమాలినో, యీలోకయాత్ర యెట్లుజరుగునో — మొత్తో యీసంసారము నాకువలదనిన గ్రామములన్నియు మునిపల్లియలగునేమో యనియే పెద్దలు, 'మామాటలు చిన్నలువినవలయును. మేము చెప్పినట్లుచేసి మెలఁగవలయును. మాయాజ్ఞలవలన మీకుఁ గష్టమువచ్చినను మీరనుభవింపవలసినదియే' యని బంధించివైచినారు. ఎదిగినకొలఁది స్వాతంత్ర్యమెదిగి 'నాకిది వలదు వీఁడు నాకు వల'దనియందురేని— ఎవ్వని నెవ్వతె యెవ్వతె నెవ్వఁడు నిల్పఁగలుగుదురు? అప్పుడు కావలులో ముక్కరులో—పశుమర్యాదలకు దిగుదురు. సంసారమును భరించుట మాటలా? దానికొఱకే శాస్త్రములు చదువుట, రాజ్యము లేలుట, "తెప్పానాం తేలానాం." పరదేశములు ద్వీపములు గుండెలు చేతఁబట్టుకొని తిరుగుట, సముద్రములు దాఁటుట, యీపాట్లు రెంటికినీ ధనముచాలదు. భూమిలోనుండి నిక్షేపములు వెలుదేఱినఁగాని యేనుఁగు దాహము చూరునీళ్లతోఁ దీఱదని భూములు పెల్లగించి యొలుకఁబోసి యెత్తికొనుట—సంసారమును భరించుట మాటలా? తాను గోఁచిపెట్టుకొని

తిరిగియైనను భార్యను గుమ్మముదిగి రానీయక, యొరుల కంటఁ బడనీయక, యింటిగుట్టొకరికిఁ జెప్పక, 'నలువురితో నారాయణ'యని సంచరించుట సంతోషముచేతనే నా! మోసముచేసి పెద్ద లిట్టికష్టములలోఁ బడఁద్రోయుచున్నారు. తప్పదు సగముసగములో విడువరాదు. దీనియంతయు చూడవలయునని కుడితిపండెలోఁ జేబొరలువేయుట యానందముచేతనా! సంసారమును భరించుట మాటలా—రోగములు రొట్టెలు, బిడ్డలను బెంచుట, పెద్దవారిం జేయుట—ఈపెద్దవారిం జేయుటలో నెంత యర్థమైన నిమిడియున్నది. ఓసర్కా—పి! ఏదీ, పెద్దవారిం జేయుట యన నెంతగంభీరాభిప్రాయమున్నదో వర్ణింపుము! వారికిఁ బెండ్లిండ్లు, వారికి సంసారములు, మన వేషమే వారికివేసి యుంచినట్లువలె, మనము కష్టపడుచున్నప్పుడు వీరేల యూరకుండవలయునని యసూయచేతనునలె—గోతిలోఁ బడఁద్రోయుటయే—అబ్బబ్బ! సంసారమును భరించుట యనిన మాటలా? మగఁడు లోకాంతరగతుఁడైన, మగువ నడుము నాయఁగట్టుకొని బిడ్డలం బెంచుట—దైవమా! కోమలేశ్వరా! ఉమారమణా! వలదు వలదు; మగువ కీకష్టము వలదు, తెచ్చిపెట్టకుము. మగువ ముందే లోకాంతరము చేరెనా మగవానికష్టము చెప్పఁదరమా! అపుడు మగవాఁడు డాఁగుడుదిగా మారవలయును. చేతఁగానిపై యీరెండువిషయములఁ దలంచుకొంటిమా, వారువారు నలవాటు లేనిపనులలోఁబడు కష్టములం జూచితిమా, స్వామీ! ఒడలు గగుర్పాటుచును. వెంటనే సన్న్యాసాశ్రమము స్వీకరింపవలయునని నంతవైరాగ్యము గడుంగష్టునకైనఁ బుట్టును. పెండ్లియనఁగా నొక్కసారి యాడుదానికి—ఆడుకొనుచున్నదానికి—ఈప్రపంచము తలక్రిందుచేసి భూలోకములోని దానినిదీసికొనిపోయి యంతరాళమున వ్రేలాడఁదీయుటయో! ఇంతకంటె వేఱొకటియని యనుభవశాలులును మఱియొక్క దానిం జెప్పఁజాలరని చెప్పవచ్చును. బాలికకుఁ బెండ్లియైనదనిన వెంటనే రెండవ పనిలేదు. 'నాపెనిమిటికి దీర్ఘాయువిమ్ము. నాభర్తకు సుజ్ఞాన మొసఁగుము. నానాథునకు నాయందుఁ గరుణపుట్టునట్లు చేయుము. నా పతికి సంసార ప్రభుత్వమిమ్ము. నా పతికి, ధనధాన్యములు ప్రసాదింపుము'—అని దేవులాటతప్ప పెద్దలు వేఱొకదారి చూపింపలేదు. అంతయు నింతికిఁ గాంతునితో నున్నది. పెండ్లియన నొక్కపందెమువంటిది. రామరావణయుద్ధమువంటిది. ఎవ్వరు గెల్తురో, యెవ్వరోడుదురో, పందెముగాదు, యుద్ధముగాదు—గెలుపుచీటులువైచికొనుటవంటిది. అదృష్టమెవ్వరివంకఁ దిరుగునో, పదికాలములు తిన్నగా నడువవలసినదేకాని—నడుమనే యంతరము వచ్చునో, శివా! వద్దువద్దు, తండ్రీ! జ్ఞాపకము చేసికొనరాదు. ఆఁడుదానికి మగవానితో నున్నది. మగఁడుతప్ప దానికి వేఱుదైవము, పూజలు, వ్రతములు, యాత్రలు లేవందురు. అర్థమేమి? బాగుగా నాలోచించితిమా—ఆఁడుదానిగతి యధోగతి! ఆఁడుదానికిఁ బెండ్లియైనపనిన మాట గుండెలు గుభేలన వ్రక్కలించు పిడుగుగాని మాటయననవచ్చునా— ఎంతమందినో చూచుచున్నాము. ఎన్నికష్టములు పడుచున్నాము. దానిపైఁగల యాశ—ఛీ ఛీ!

“అన్నమైన నదేమిరా, సున్నమైన నదేమిరా” యని వేదాంతి—అన్నము సున్నము నొక్కటియే కనుక యన్నమే తినవగునుగదోయని—సాగునఁట. అట్లే సుఖదుఃఖములలోఁబడిన సంసారియును బాడును. దానిలోని రుచియెట్టిదో—దానికున్నరుచి యితరవస్తువులకు లేదు. అజీర్ణముం జేయు తీయనిలడ్డువమందిన బుద్ధిపుట్టునుగాని యారోగ్యమునిచ్చు మిరియములకషాయముఁద్రావ బుద్ధిపుట్టదు. నేను గనినిగానుగాని వేదాంతిని—నేను సంసారమునుగూర్చి వర్ణించిన భ్రమరకీటన్యాయము పట్టునేమో—పట్టకేమి? నేనెందున్న దానను? సంసారమును పెద్దనెడలు పైనతేనె బాలియందమిరఁ వ్రాలినయీగను; పడుచున్నదానను, బాణలిలోఁబడి యెక్కుడడిసి కాలుచే తులంటుకొనిపో విలవిలలాడు సమయమేయింక. నేనొక్కరినిభూషించిన దూషించిన 'నీవే ప్రపంచమునుండి యూడిపడితి'వని నలువురు నవ్వుదురు.

ఆభగవంతుఁడు మమ్ము మఱచిపోవలసినదే. కాని, మాలోనే యున్నది? మాపై నాతనికిఁ దలంపులేకుండ నుండవలయును. అట్లయిన మేము మువ్వురము నొకరీతిగా నుందుము. ఏల తలంపకుండ నుండును? అంతటి తొందరపనివాఁడు జగత్తులో నింకొక్కఁడు లేఁడు. ఆభగవంతుని దేనెటేఁగతోఁ బోల్పవచ్చును. ఇది హీనోపమయందు

లేమో కాని యాతనిపట్లఁ బూర్ణోపమయే — ఒక్కక్షణ మూరకుండఁడు. ఏక కాలమునందే రెండుమూఁడు లక్షల కోట్లు పనులుచేయ మొదలు పెట్టును. పట్టణములోని రాజకిరీటములోనికి మణినిగల్పించుటకును, గుహాలంగో నిద్రించు నేసింహము చెవిలోనో, రోమములమీఁదనో గుసగుసలాడు మిడతల్లికో చీడపేనునకో కాలువిఱుగఁ గొట్టి బాధించుటకు, మహాసముద్రములోని తిమింగిలమును గడుపుపూడ్చి, తిండిదొరకక చిఱుచేఁపలై పరుగులిడుచున్న దానిని వేఁటాడుటకై వేటకాండ్రను సన్నాహము చేయను,—ఒక్కదాని కేమి—యన్నింటికిఁ దానేపోవలయును. ఒక్కచెట్టు నెండింప, నొక్కచెట్టు (బండింప) నొక్కయూసరాల్ప, నొక్కకొమ్మ చిగిరింప- నొక్కడనో వడగొట్టి దారిలోఁ బడిపోయిన బాటసారి ముసలివానికి గంజినీళ్లు పంపుటకై సంసారి నొక్కని లేపను, మునిఁగిపోవుచున్న ద్వీపాంతరములోని యోడలోని బాలు నుద్ధరింప నొక్కపలక నమరించుటను—'ఇందుఁగల డందులేఁ'డని సందేహముతోఁ బనిలేని యీశ్వరుఁడు-మనలను మఱచియుండునా! పాపము మఱచియే యున్నాఁడు. మేమెన్నిపాట్లు పడుచున్నామో కనుఁగొనుటలేదు. మా కర్మమున మేమున్నాము. అదిగోఁ గర్మమనఁగా నెవ్వరు? అట్టే దూరము పోవలదు. వేదాంతము ముదురనీయరాదు.

లక్ష్మీనారాయణునకుఁ దల్లి లేదు; తండ్రి యున్నాఁడు. శంకరదీక్షితునికిఁ దండ్రిలేఁడు, తల్లిగలదు. 'వారములు చేసికొని నాలుగు ముక్కలు నేర్చికొనుటకై నన్నుఁగూడ విడిచిపెట్టి స్థలాంతరవాసముచేసి కష్టార్జితముగా సరస్వతితోపాటు లక్ష్మిని సంపాదించుకొన్నాఁడా మాలక్ష్మీనారాయణమూర్తి'యని యాతండ్రిపడిన సంతోషమునకు మేరలేదు. 'ఎన్నిదినములైనది! నాకిప్పటి కీశ్వరుఁడు సుఖముం గూర్చినాఁడా! నాకొడుకు గృహస్థాశ్రమము స్వీకరించాఁడా! నాకు నట్టింట నాకు నైచి వడ్డించుటకు నాభార్య యీకోడలిని బంపించినదా!' అని, చెప్పనలవిగాని సంతసము. మాయమ్మ, 'కొందఱివలె. నడుగుపెట్టఁగానే పిడుగు పడినదన్నట్లు— అత్తవారియిల్లు చేరఁగానే కుండ చేతికి వచ్చినదని విచారింపలేదు. పోనిమ్మ, సందెగుమ్మ మూడ్చి నీళ్లుచల్లి, నాలుగుముగ్గుకఱ్ఱల వెట్టుటకుఁగాని, దీపము వెలిగించుటకుఁగాని 'లేక, పాడుపడియున్న సంసారమును నాలక్ష్మి మరలఁ బొత్తుచేయుచున్న'దని యానందించినది. అలవాటుచేత—'అమ్మా నే నుదికికొందునే; నేను మంచినీళ్లు తెచ్చెదను; బిందె యిట్లిమ్మని మామగారు దయచేతనే పల్కినాఁడు. "విూకేలకష్టము నేనుండఁగా" నని లక్ష్మి పల్కెను. "నేను జేసిచేసి మెలఁకువలు నేర్చియున్నవాఁడను, నీవు క్రొత్తదానవు—నీవుండు" మనువాఁడు—"నేర్చినవారు మీరు నేగని దానికి నాకు నేర్పుఁ" డను నది లక్ష్మి— ఒక్కపని చేయనిచ్చునదికాదు. లక్ష్మీనారాయణునకు వేఱుపనిలేదు. ఏఁడాదికొక్కసారి బళ్లిపాడువెళ్లి దస్తుసిస్తులు తెచ్చికొనుట, తండ్రిని బువ్వలలోఁ బెట్టి పూజించుట—'ఆహా! శంకరా నాపై దయవచ్చినదా! దయవచ్చినదానికా మరల సంసారములోఁ బడవైచుచున్నాఁడవు.' అని యాముసలాయన రాత్రిందివము లాకోడలిని గొడుకును ముద్దుసేయుటతప్ప వేఱుపనిలేకుండెను. గౌరియత్తగారు- 'భగవంతుఁ డెక్కడలేఁడు; దిక్కులేనిదానను; ఒక్కగా నొక్కకొడుకు; ఆపూఁటకు గతిలేదు; దేవుఁడా యెట్లురాయని బెంగపెట్టుకొన్నదానను. నాకొడుకుపై దయవచ్చినదా! తిండిలేనివాని కైశ్వర్యమిచ్చి, భార్యనిచ్చి, దీర్ఘాయుష్యమిచ్చి నాకన్నులు చల్లఁబఱిచి నన్నుఁ జలికాలఁదన్నినాఁడా! అమ్యతరామయ్యగారు పెట్టినదీపముగదా యిది. దివ్వెవెట్టి యామహాత్మునకు మ్రొక్కవలయును. 'ఏటికొనితిను కుఱ్ఱవాఁడే, వీనికేమి మనబిడ్డనేమి, యిచ్చుటయే'మని తలఁచినాఁడా; అగును, పూటకిఁదక్కువగాని కులమునకుఁ దక్కువగాదుగదా; ఏ దంతస్తులమేడమీఁద నింకొక్కయంతస్తు లేవఁదీయుట మంచిదా పడిపోవుచున్నధర్మసత్రము నడికొప్పు బాగుచేయుటమంచిదాయని యాలోచించినాఁడు.' అని పొంగిపోయినది. మాయమ్మ, 'అయ్యో! అత్త కోడలికము కత్తిమీఁది సాముగదా! ఆముసలిదానిచేతిలో నీకసుగందు, బ్రదుకుటయె'ట్లని కొందఱవలెఁ దలంచినదా! మఱికొందఱివలె 'నా ముసలిముండచచ్చిన మావాండ్రిద్దఱుమా యిగానుందురుగదా'యని దురూహాలు పెట్టుకొన్నదా! లేదు 'బిడ్డయడుగువెట్టినవేళ మంచిదైనఁ బదిమందిచుట్టములు వత్తురుపోదురు. అల్లవారిపిల్ల మంచిది; మట్టాలసు

రభి యని పొగడుదురు. అత్తయింటఁ గొంతచేయూఁత యున్నది. మగఁడు చిన్నతనమునుండి సుపరిచితుఁడు, బుద్ధిమంతుఁడు- యేమోయేమొకొని తిండుగని విడిచి నామా, కంచము, ముంత, పంఁడు, గుడ్డ, యిచ్చి బ్రదుకుమని పంపితిమి- ఈనిసువుల పుట్టటికమున నా కన్నివైపుల బంధుజాలము పెరుఁగునుగాక! నాకేమికొదవ-'అని కొదవయేదో జ్ఞప్తికిరాఁగాఁ గొంతసేపు కన్నులనీరుపెట్టుకొనుచు ననుదినముగాలక్షేపము చేయుచున్నది. ఆకొదవ భగవంతుఁడు తీర్చవలసినది; తీర్చినాఁడు కాఁడు; మించ లేదు. తీర్చవచ్చును. ఎంతమంది కొదవలు తీరినవికావు.

మాయమ్మకు మాకుటుంబముపై బెంగయున్నఁదను లేదు. నిర్విచారము, విచారము లేకేమిగాని- ఇది యొక విచారమా-'దేశముగాని దేశములో నున్నది. మనమాట మనమంతి లేదు. బిక్కుబిక్కుమనుచు నున్నది. మగవాఁడు పనిలోనికిఁ బోవును. ఇరుగా పొరుగా; ఏదో భాషయఁట. దీనికేమి తెలియును.' అని తలపోయుట మాయమ్మ కొక్కవిచారమేమో కాని నాకు విచారము లేదు. మేము రైలులోని పనివారముగుటచేఁ గాశీ యాత్రకుఁబోవు తెనుఁగువారందఱు మాకుఁ బ్రతినిత్యము కనఁబడుచుందురు. దేశక్షేమము, గ్రామారోగ్యము, బంధువార్తలు తెలియుట కెవ్వరో యొక యొఱుకవారువచ్చుచునే యున్నారు. ఎఱిఁగినవారు రైలులోఁ గనఁబడిన 'రేపు వెళ్లవచ్చును రం'డని దింపి యింటికిఁదీసికొనివత్తురు. మా కొనాఁడు వారితోఁ జిల్లుబొల్లుమనుచుఁ గడచిపోవుచున్నది. లచ్చికిఁ జీరయని, నాన్న కుధానళియని, గౌరికిఁ బొట్టురవికెలని, అమ్మకు మహాలక్ష్మీపీఁటయనిఁ గౌరి యత్తకుఁ దులసికోటయని, లచ్చిమామగారికి నాగరాక్షరముల పుస్తకములని యేవో యెవ్వరిచేతనో మేమిక్కడినుండి పంపుచున్నాము. మాకేబెంగయును లేదు. అందఱిక్షేమవార్తలు తెలియుచున్నవి. కనుక, నిరాలోచనముగ నున్నారము. జీతమంత యెక్కువదిగాదు. అత్తమామలకు మాదానిలోనుండి వారికిఁ జలినీళ్లకు వేఁడినీళ్లు తోడని పంపుచుందుమే కాని వారినిద్దఱ నిక్కడఁ బెట్టుకొనుటకుఁ జాలినంత లేదు. వారికక్కడ, మాకిక్కడఁ గడచుచున్నదని సంతోషము. అంతటివంటి గుణముగల వారైన నింక రెండుకుటుంబములను బోషింపవచ్చును. గడి పఱక-కొంకకొలాడునిప్పువలెఁ జూతురు. తామేయున్న వారిలో నక్కడఁ బెద్ద. పెత్రింపఁ బదిమందియున్నారు. తెఁగటుసాలో నొక్కరు, చీట్లిచ్చువా రొక్కరు, రాత్రిపనివారు కొందఱు, దీపములుమార్పుటకు, దారులు మరలించుటకు, మూటలెత్తుటకు దింపుటకు, తుడుచుటకు నెందఱోయున్నారు అందఱు నొక్కత్రాటిమీఁద నడిపింతురు. 'కక్కుఱితిపని పనికిరాదు. అడిగి పుచ్చుకొనుఁడు. దారులు కొట్టవలదు. మనజీతము మన కమృతము. అన్యాయవిత్తము విషము. మనసు కుదిరియిచ్చినది పుచ్చుకొనుటలోఁ దప్పులేదు. అది మనకరుగును' అని బోధించి వచ్చి పెట్టెలుపడియున్న మూటలలో నుండి కోసి యపహరింపకుండ నేతి డబ్బాలకుఁ జిల్లులుపొడవకుండఁ గట్టడచేసిరి. వచ్చెడువర్తకులు, బాటసారులు,'స్టేషను మేష్టరుగారు బహుమంచివారు, చక్కనవారును సజ్జను'లని పొగడుచుండిరి. పూగ, కాయ, గింజ, గిట్ట, నూనె, నేయి, పండు ఫలము స్టేషనులో నెగుమతికి వచ్చినవి దిగినవి మాపదిమందికి దొరకుచున్నవి. న్యాయముగా మంచిచేసికొని తినినవది లోపకార్యమవరాదు. అట్టివారు కానియెడల 'వీరు తీసికొనితినుచు నేయున్నారు; మరల మన మేల?' అని నిరాదరమునసింతురు. పనివాండ్రందఱును మహారాజ్ మహారాజని యడుగులకు మడుగులొత్తుదురు. ఈ మహారాజువలనను మనకింతయన్నము దొరకుచున్నదని సంతోషపడువారు. విశేషమేమనఁగా నీ స్టేషను, మాఊరూల నేకొండలలోనో లేదు. పట్టనము సమీపమునఁగలదు. కావలసినంత బయలుగలదు. నలువురివలెనే మేమును జిన్నగొరావును సంపాదించికొన్నారము. చిన్నమేష్టరుగారు మాకంటెముందు వచ్చియున్నవారు, గావున, వారొక్కయావును సంపాదించుకొనియున్నారు. రెంటిని మేఁపలేక 'సంప్రదాయము మంచిది. మాయింటఁబుట్టినది, సాలుకుడిచినది, ప్రక్కకు శేరుపాలిచ్చు దానిబిడ్డ, మీరుపుచ్చుకొనుం'డని యేదోరూపము పేరు పెట్టి మాకిచ్చినారు. నెలనెలకుఁ గొంచెము కొంచెముగా దానివెల మాయొద్దనుండి పుచ్చుకొనుపద్ధతిమీఁద గ్రహించినారము. నాకుఁబుట్టినింటఁగూడ దూడలపరిచయము గలదు. ఏకాఁపో బండెఁడు గడ్డిపంపుచున్నాఁడు. పనివాండ్రు చేతిలోనున్నారు. ఆవీని పెయ్యదూడనుబెట్టి

నది. నాకింటియొద్ద నొకరితోఁబనిలేదు. దూడలేమో, నేనేమో పొట్టనిచిట్టని- కట్టుఁగఱ్ఱయొద్దఁ జుడిచిపోడి గానుంచుట, యిలువలు నానవేయుట- చెప్పవలదా? ఒక్క పనివానియిల్లాలుదొడ్డది. 'మాయీ, మాయీ' యని నన్నుపు డువవలదు. దానిమాటలు అమ్మాయీ! అమ్మాయి! యని మాయమ్మపిలుపువలె నొక్కప్పుడు తోఁచుచుండును. తల యంటుకొనునపుడువచ్చి షీకాయనూఱిపెట్టును, వీఁపు తోముచు. నా తెనుఁగుపంతులామె కెంతో యిష్టము. ఏదో వంతెనలు కట్టునపుడు చిన్నతనములోఁ దండ్రితో మన దేశమువచ్చినదఁట- ఆపరిచయముచేత, నన్నాపె పూర గాయపాటలతో నన్ననుసరించుమందును. ఆమె సావాస మే నాకుహిందీ నేర్చికొనుటకుఁబనికివచ్చినది. దొడ్డితుడుచు వానికొడుకే మా యావును బగలంతయు నెక్కడనో మర లించి మేఁపుకొనివచ్చును. ఎప్పుడైననేను, తోటకే యనిపిలి చిన, 'హా! మాయి!' యని యంతటనువచ్చి పడుదురు. చిన్న మేష్టరుగారు బాబూలు; వారిభాషయిదికాదు. కానిదేశభాష హిందీ వారికివచ్చును. ఓహో యనుచుఁ, గవులకార్యము లపుడేకాని వారియాఁడువారితో గట్టిపరి చయము నాకుదొరక లేదు. నీళ్లగొట్టముకడకు వారురారు. ఏపనివాఁడో తెచ్చియిచ్చును. మఱియు వారియింటికి మాయిల్లు కొంచెముదూరము.

కొన్నినాళ్లకుఁగాని తెచ్చికొనవలసినది బియ్య మును వస్త్రములునే. తక్కినవన్నియు యథేష్టముగా నిం టికి వచ్చుచుండు నంతటి సమయము వచ్చినది. ఢిల్లి సముద్రులను రప్పింపవలయునని తలంచిరి. రైలులోఁ బెద్ద యధికారుల మూలమున వారినిప్పుడును రప్పించుటకు ధారా ళముగా మార్గపత్రము సంపాదింప గట్టి యత్నముచేసిరి. ఇంతలో సామ్యము చెప్పినట్లు - ఒక్కరాజు సకు బీద వానిపైఁ గరుణవచ్చి యేనుఁగు నిచ్చినాఁడఁట-ఏనుఁగును బుచ్చుకొన్నానన్న సంతోషమే నా - పెంచుటలోఁ గష్టముమాట! ఈరీతిగానే జీతమెక్కువ చేసి నామని యధికారులు కలకత్తాకు మమ్ము మార్చినారు. చీపురు పుడకగొద్దినుండి యిక్కడి దిక్కడనే విడిచి, యాపద్ధతి మీఁదనే యావును దూడ నొకరికిచ్చివేసి-జీతమెచ్చునకు నగరములో రెట్టింపు సెలవులకు - సమానమానసములతో నధికారులయాజ్ఞ ననుసరించి కలకత్తా చేరితిమి. ఇంక వారిని దీసికొనివచ్చుట యెక్కడ? గొంచెము గొప్ప? చేతిలోనిది కూడ నెగిరిపోవు నవస్థవచ్చినది.

“మహారాజ్ కో బదలీ హోగయా హై” అని యక్కడి పనివాండ్రే కాదు- చుట్టుప్రక్కల వర్తకులు మొదలగువారు మేము రైలుదేఱునాఁడు రైలుకడకు మమ్మంపవచ్చిరి. ఇదియును జెప్పవలసినదే. రైలుకదలు నపుడొక్క వర్తకుఁడు ప్రీతిపూర్వకముగాఁ దాంబూల మిచ్చినాఁడు. అది మే మొకటి రెండు నెలలు తడవు కొనకుండఁ గలకత్తాలో దక్కఁగా స్థిరపడుటకుపకరించి నది. ఆ తావు విడుచుట మాకును గష్టమే యనిపించినది. అత్తవారింటికిఁ గ్రొత్తకోడండ్రు వెళ్లునట్లు దిగులుదిగులు మనుచునే వెళ్లినారము. అక్కడమాత్రము మనుష్యులు లేరా? ఇదియేనా మనము పుట్టినప్పటినుండి నివసించు చున్నది? నేను గాక మునుపు రెండు తావులకు మాఱితి. ఎక్కడనున్నను నోరుమంచిది కావలయును. మన దేశ స్థులు కలకత్తాలోను పెక్కుమందియున్నారు. కాశికి వెళ్లువా రంతయు నక్కడనే దిగుదురు. కాళికాదేవి సామీ ప్యముం జేరితిమి.

## ఎనిమిదవయంకురము

విద్యయం దాశలేనివారును, గతించిన వ్యర్థకాల మునకై పశ్చాత్తాపపడనివారును, బెరుగఁడింపవలయునను నభిప్రాయము లేనివారును, ధనమున్నదే చాలును-మఱి యక్కఱలేదనువారును, బీదపైనను సంసారభారమునకు విసిగినవారును సాధారణముగా నుండరు. పెండ్లికాక మునుపే-'యింటనున్న విద్యయబ్బినదికాదు. అది నాలో పముగాదు. నాయదృష్టదేవతచేసిన లోపము. ఊరిలో వేఱు విద్యనేర్చికొనుట కుపపత్తులులేవు. అది నావంటి బాలురు చేసిన సంఘదుష్కృతము. ఇంటఁ గావలసినంత ధనమున్న నేపట్టనమో చేరి యేదో చూడవచ్చును. అది మాకుటుంబము చేసికొనిన దౌర్భాగ్యము. వారితో వారితోఁ జేసిన కృషియింటిలోఁ దండ్రితోనే చేయక పోయితినే- దృష్టి వేఱుగానుండుటచేఁ దండ్రిమాటలు చెవి కెక్కలేదు.''కలవిద్యలెన్నియైనను గలవిద్యకు సాటి రావు-' దానివలన ధనమురానీ మాననీ, యది యలవడినది గాదు. ఇహపరసాధనములైన వేదాదివిద్యలు నా కబ్బునా! పొట్టకూటి విద్యయైన నొక్కటి యలవడినదా!

ఈకొలకలు, నీయుప్పరిగారు, పెద్దవారును నాకు సహవాసముచేయునదియు నొక విస్మయమే నా! దానిపై నేదో కొంత యభిమానము గలిగినది. 'చదువునకిద్దఱు జపమునకొక్కఁడు' నని సామెత—తండ్రిగారు చెప్పఁబోవు చదువునకు సహాధ్యాయుఁడు లేకపోయెను. ఎవ్వరో కొలతల యుద్యోగితోఁ దిరిగిన నాకేమి ప్రయోజనము? నాకాతఁ డేదైన పనిచెప్పునా, యీతడు స్వాతంత్ర్యము గలవాఁడు కాఁడు. వెనుక నొక్క చిన్నవానికి సమయమట్లు వచ్చినది. దొరతోఁ జెప్పినాఁడు. రెండుకోసుల దూరము తిరిగి మార్గములోఁ జెట్లు చేమలు, తూములు, మార్గము మొదలగు పల్లములు సదును చేయించుట—ప్రయాణికుల సౌకర్యమునకు రాదారిని గాపాడుటయే యాతని పనియై యుండెను. ఆపనిలోనుండి యాబాలుఁడు చేసిన గర్వపు దుశ్చేష్టలు — పనియిప్పించిన వాని మర్యాద పూడఁ దగ్గుటకు హేతువైనది. తనకు పదిరూపాయల జీతమా! దనక్రింద నొక్క మూడురూపాయల జీతపు సేవకుఁడా! తన కుద్యోగ మిప్పించిన పెద్దయుద్యోగి యాయనల కొలఁది కాలినడకను దారులు మారుటకు వచ్చుచుండ నీచిన్నవాఁడు తట్టుగుఱ్ఱము నెక్కి వచ్చుటయా — సేవకుని జూచిరమ్మని తానింటఁ గూర్చుండుట — నలువురచేఁ బనిచేయించి యూర్వరిను బద్ధు వ్రాయుట—ఇట్లుండ "విషవృక్షోపి సంవర్ధ్య స్వయంఛేత్తుమసాంప్రతమ్" మ్మని యుండుటచేఁ గొంచెము సహించి వినకున్న మిన్నకుండి, పాపమాయన చిన్నవాని నేమియు ననకుండఁగనే లోపములు తానే సవరించుకొనుచుఁ గాపాడి కొన్ని దినములలో వేఱొక తావునకు మార్పఁబడిన తరువాత వచ్చిన యొక్కరు విషయముఁ దెలిసికొని యధికారమును దూలఁదీయించిరి. "అధికారాంతమునందుఁ జూడవలదా యా యయ్య సౌభాగ్యముల్" మన్నాళ్ళ యల్పోద్యోగమునకై రెపరెపలాడి గజాంతైశ్వర్యమబ్బినట్లు బ్బినవాఁ డన్యుని యాచించుటకు మతియొకపని చేయుటకు నభిమానము కల్గెను. సలము పెద్దది; బలము తక్కువ? చెప్పవలసినదేమి? ఆ బాలుఁడు చివరకు— 'అప్పాలు తెన్నులు— మప్పుమూఁడు తెన్నులు' చేసినాఁడు. ఇట్టియూళ్ళలోని యుద్యోగ మొక యుద్యోగమా? ఇంతకంటెఁ బసుల వెంటఁ దిరుగుట? సదుద్యోగము' అని మనస్సులోనుండెను. 'పరులనుఁ జెప్పక—లోలోన—తలిదండ్రులను విడుచుటయెట్లు? తానొంటిగా నింకొకస్థలమున నివసించుటయెట్లు?' అని చింతమనస్సులో మెండుకొనినది. సింహాచలయాత్రనుండి యింటికిరాకుండఁగనే మార్గములోఁ బెండ్లితటస్థించినది. ఏది యేనొక్కయుపాయము మాచికొని— తండ్రినడుగకుండఁ బెండ్లిమున కొక్క అవికగుడ్డకొనుటకు రెండణాలైన స్వతంత్రముగా సంపాదింప లేకుండ నింటఁబడియుండుట యొక్క పౌరుషమాయని పుట్టినదికాఁబోలును దిగులుపడుచు నేకాంతవిచారమునకు మొదలుపెట్టిరి.

సత్యకాలపు తల్లిదండ్రులు గ్రహింపలేదు. అపుడపుడువచ్చు "ఓవరుసీరు" గారు కనిపెట్టినారు. 'అబ్బాయి! ఏలనీవు మునుపటివలె లేవు? విచారముగాఁ గనఁబడుచున్నాఁడవు, కారణము నాతోఁ జెప్పు' మని యడిగిరి. 'నాకీయూరఁ దోఁచుటలేదు. ఏపట్టణమునకైనఁ బోయి యొక్క కాలక్షేపవిద్య నేర్చికొనవలయుననియున్నది. మావారొడఁబడరు. నేను స్వతంత్రింపఁజాలను. నాకేదియు నుపాయము తోఁచుటలేదు' అని యోవరుసీరు గారితో విన్నవించిరి. 'దీనికింత యోజనయేమిటికి? మాబంధువులే, ధనాఢ్యులు, వ్యాపారులు, నొక్కపట్టనములోనున్నారు. మీఁదు మిక్కిలి విద్యాధికులు— నీకేవిగతి వ్యయంవక్తిరుచికలదో దానిని నేర్పించెదరు. నేను నిన్ను వారికొప్పగించెదను పోయెదవా' యనిరి. కృతజ్ఞతగంతులైచి 'పోయెద'ననిరి. 'వారి పేరను త్తరము చెప్పెదను నీవే వ్రాయుము.' అని కాగితమును గలము నిచ్చి 'అన్నగారికి—నమస్కారములు, ఈయుత్తరము తెచ్చిన బాలుఁడు నాకిష్టుఁడు. పల్లెటూరిలోనుండి కాలము వ్యర్థ మగుచున్నదని పశ్చాత్తాపపడుచున్నాఁడు. వీనికేదని మీరొక యుపాధి కల్పించెదరా నాకుఁగల్పించినట్లు సంతోషించెదను' అని వ్రాసి తాము చేవ్రాలు చేసి యాపట్టనమునకుదారి యానవాళ్ళుఁ జెప్పి తండ్రిగారియనుమతి యిప్పించి పంపించిరి. చూడఁగనేయామహారాజు—వీరు తెచ్చినయుత్తరము పుచ్చుకొని చదివికొని—'దీనిని వ్రాసినవారెవ్వరు? నీ పేరెవ్వరు, గ్రామమేది' యని కుశలప్రశ్న చేసి తమగిడ్డంగిలో సాయంకాలమువఱకుఁ గూర్చుండుమని— రాత్రియింటికిఁ దనతోఁ దీసికొనివెళ్ళి, తమప్రక్కనే భోజనము పెట్టించి, మేడమీఁద

దికిఁ దీసికొనిపోయి కూర్చుండి- 'మరల నీవేయుత్తరము మీయోవరుసీరుగారికి వ్రాయు' మని—'మీరుపంపినచిన్నవాఁడు వచ్చినాఁడు. ఇతని కభిమానముగలవిద్య యేదియో యది మేము నేర్పించుటకు మాకనేక సౌకర్యములున్నవి. మేమనేకవ్యాపారములలో నుందుము. దేనిలోనైన బ్రవేశపెట్టవచ్చునుగాని, ఈతనితల్లిదండ్రులసమ్మతిని మీరు కనుఁగొని రెండుమూఁడుకట్టుబట్టలిచ్చిపంపవలయును' అని వ్రాయించి చేవ్రాలుచేసి, 'అబ్బాయి! నాకుఁ గొంచెము స్వస్థతగానున్నది. ఉదయమున నేను లేచువఱకుఁ గాచుకొని యుండవలదు. నీవు మరల నన్నుఁ జూడనక్కఱ లేదు. ఒడ్డెమంగలి నీకుఁ గ్రింద మంచముమీఁదఁ బ్రక్క వేయును. పండుకొని తెల్లవాఱఁగనె లేచి వెళ్లిరమ్ము. భయము లేదు. నేను నీకుఁ గావలసిన విద్య నేర్పించెదను.' అని ధైర్యము చెప్పిపంపించిరి.

తలిదండ్రులకేమి, మన ఓవరుసీరుగారికేమి యీ ప్రత్యుత్తరము సంపూర్ణానందము గలిగించినది. మంచి దినముఁ జూచి తండ్రిగారే దిగవిడిచి వచ్చినారు. నడుమ నడుమఁ గార్యాంతరములమీఁద వచ్చుచుండు ఓవరుసీరుగారు క్షేమసమాచారములు కనుఁగొనుచుండిరి. 'ఏవిద్య వచ్చినను రాకపోయినను వ్యవహారమునకు ముఖ్యముగాఁ జెప్పినదానిని చక్కఁగా వ్రాయువాఁడు లేక చిక్కుపడుచున్నారము. మీరు మాకుఁ జక్కని కుఱ్ఱవాని నప్పగించినారు'- అని వారోవరుసీరుగారిని స్తుతించుచుండువారు. పుత్రసంతానములేని యీ మహాత్ముఁడు - వీరిని బెద్దకొడుకువలెఁ బెంచి విద్యాబుద్ధులు నేర్పెను. ఒక్కప్పుడైన నొంటిగా విస్తరివేయులేదఁట. ఆ ఇల్లాలు కన్నతల్లికంటె మంచిదఁట - తమతోపాటు సమస్తసదుపాయములు చేసిరఁట- ఏమహాంతుఁడవరుసలో మొదట- వీరు నిలువఁబడినచో నందఱు నేక గర్భజనితులవలెనో యనుభావించునంతటి సమానవయస్కులగు నా బాలికాసంఘమును వీరియందు చిన్నగారియందువలె భక్తివిశ్వాసములు గల్గియుండెనఁట- ఆ సంస్కృతుఁడు, సజ్జనుఁడు, సర్వజ్ఞుఁడు, దేవభాష, రాజభాష, మాతృభాష చక్కఁగా నెఱిఁగినవాఁడు. లక్ష్మీసరస్వతులు వైరముమాని వారియింట మెలఁగుచుండిరి. మహాబుద్ధిశాలి, బ్రహ్మవేత్త, తపోనిధి, నేర్పరి, తీర్పరి, ఎక్కడకుఁ జనుచున్నను, గుఱ్ఱపుబండిలోఁ గొమారునివలెఁ గూర్చుండఁబెట్టుకొని పురమంతట సంచరించువారట. కొన్ని నెలలు గడచినవి. శీతోష్ణాదిస్థితులు కొంత వికటించినవి. జ్వరమువచ్చినది. మొగమునఁ బొక్కులఁ గొంచెము మెఱుఁగు చూపెను. ఇంట సమస్తమును గలవు. స్వయముగా నావహారాజును వైద్యుఁడు. మేనమామ ప్రసిద్ధవైద్యుఁడు. మందులిచ్చుచునే యుండఁగా గిళ్లనొప్పులు వచ్చినవి- బెంగజబ్బేమో యని బండిచేసి తలితండ్రులయొద్దికిఁ బంపివైచిరి. ఏఱు దీసిపోయినట్లు నాలుగురోజులలో నన్ని జబ్బులును బోయినవి. మఱిపదినాళ్లుండి క్రమ్మఱఁ బట్టనముం జేరెను. నాఁడునాఁటికి వ్యాపారములోని విషయములు బోధపడఁ జొచ్చెను. ఒక్కొక్కప్పుడు దాము రాక 'అబ్బాయి! నీవు వెళ్లి యాపని యట్లు లీపని యిట్లు చేయించి తలుపులు జాగ్రత్తగా మూసికొని, యెంతమంది పనివాండ్రు పనిచేసిరో, యెవ్వరేపని చేసిరో వ్రాసికొని ర'మ్మని స్వతంత్రుని జేసి పంపుతారు. చెప్పినట్లు చేసికొని వచ్చుటయే కాక మఱునాఁటికిఁ గావలసిన యేర్పాటులుకూడఁ జేసి వచ్చుచుండుటచే వారిమనస్సునకెక్కెను. కొంచెమో గొప్పయో రాజవిద్య యలవడినది. వ్యవహారకాండము కొంత నేర్పిరి. పదిమందికిఁ బరిచయము చేసిరి. ఇట్లు మూఁడేండ్లయిన జరుగకుండఁగనే నలువదియేండ్లయిన వయసు రాకుండఁగనే యీ మహారాజు స్వర్గస్థులైరి. ముసలితల్లిని, తపస్వినియైన యిల్లాలిని యజ్ఞానము సంతానమును విడిచి చనినారు- ఈయనయందు దంతకంటె నెక్కుడు ప్రేమకనఁబడు ముసలికాశ మెక్కుడిది. వృద్ధమాత మాత్రము వదలెనా! 'అబ్బాయి! అబ్బాయి!' యనికూడఁ ద్రిప్పుకొనుచుఁ గొన్నాళ్లు వ్యవహారములలోఁ ద్రిప్పుకొనియెంగాని యీమె కేకపుత్రప్రేమ భూలోకమునం దసహ్యము పుట్టించెను.

తర్వాతను బంగ్రాంతమైన యీ వ్యాపారములలోఁ గొన్నిసంవత్సరములు పనియెఱిఁగియున్నవారగుటచే నుండవలసివచ్చెను. ఇతరులయొద్దఁ బనిచేయుచున్నను భోజనము, బసవారియింటనుండి మార్చుటకు వలనుగాకపోయెను. మరల నొకజబ్బువచ్చినది. అది, యెంత మంది వైద్యులకును దొరకలేదు - ఎఱిఁగియున్న వైద్య

లందఱు శ్రమపడిరి. ఒక్కనాఁ డావ్యాపారశాలలలో నుండి యొక సేవకునిచేత ‘నేఁడు నే నింటికి రాఁజాలను. రాత్రి యింటే పండుకొందును. ఉదయమున లేచి వత్తు’నని వార్త యంపినాఁడు. అదివిని యాతల్లి పడినదుఃఖము చెప్పనలవికాదు. ‘ఈమాటచెప్పినంతనే వారు దుఃఖించుచున్నా’రని సేవకుఁడు వచ్చి చెప్పెను. ‘అయ్యో’యని వానిబుజమున నానుకొని మెల్లగ నడచి యింటికి వచ్చిరి. అప్పటి కాయమ్మ ‘బిడ్డల నింటిలో నుండుఁ’ డని లాందరువేయించుకొని సేవకునితోఁ గూడ బండిపై వైద్యునింటికిఁ జని ‘బాబు! పిల్లవాని కేమియును గుణము కనఁబడుటలేదు. నేఁడింటికి రానని చెప్పి పంపినాఁ’డని విచారించుచుఁ జెప్పెను. ‘అమ్మాయి, నీకీ మమకార మెందుకు- వానికిక్కడఁ గుదురదు, పదిదినములకుఁ గొన్ని పొట్లము లిచ్చెదను పల్లిపండ్రుల దగ్గఱకుఁ పంపివేయుము. నీవీటిదన సత్తిఁబెట్టుకొనకు’మని నిస్పృహను వెల్లడించిరి. ఆతల్లి యేమియు ననఁజాలక చీకటిలోఁ గన్నీరుకాఱుచుచు నింటికివచ్చినది. అప్పటికేవచ్చి- దొడ్డిలో బైటమంచముమీఁద మూల్గుచుఁ బండుకొనిరి. చూచినంతనే దుఃఖమును మరుపపఱుచుకొని ‘అబ్బాయి! యెట్లున్నది. పోనీ, యక్కడఁ బండుకొనిన మంచినీరే కావలయునో యేమి కావలయునో యెవ్వరక్కడనని కలఁతపడితిని. బాబునడిగివచ్చితిని, రేపు పొట్లములిచ్చెదనని చెప్పె’నని యౌదార్యమాటలాడెను. ఆరాత్రి యాఁకలిలేక యన్నము తినలేదు. ‘అయ్యో యిఁక నేమిదారి? తిండిపడిపోయినదే’ యని యామె గట్టిగాఁ బలికెను. ‘ఈయునకుఁ దోఁపలేదు. నన్నింటికిఁ బంపివేయుఁడు. రాముని నాతో నిచ్చిన నేను బోఁగలను. ఒక్కమాసము నే నందుంటికు నాదురును- మరల వచ్చెద’ననిరి.

‘అక్కడ మందెవ్వరిచ్చెదరు. పల్లెటూరు-’

‘ఇక్కడఁ బట్టనములో మందిచ్చిన గుణముకనఁబడినదా.’

‘ఇతఁడుగాక నింకొక వైద్యుఁడున్నాఁడెక్కడ-’

‘ఎవ్వరైననింతే. నాకు ధైర్యము లేదు, మీకుఁగష్టము గలుగకుండవలయునని చూచుచున్నాఁడను.’

‘మాకేమికష్టము, మాకేమియుఁ గష్టము లేదు. నీకేమియుభయము లేదు.’

‘నాకొక్కటియేభయము. మీకుఁ గష్టముకలిగించుచున్నాఁడనని-’

‘నీవేమియు సందేహింపవలదు. నీకేమి కావలసినను రాముఁడున్నాఁడు. వరసమ్మయున్నది. వారు నీకు సమస్తోపచారములు చేసెదరు. మేమేమియుఁ గష్టపడము.’

‘నేనిక్కడ నుండఁజాలను- కొన్ని దినములు నన్నింటికిఁ బంపివేయుఁడు.

‘నామాటవినుము; నీవక్కడకువెళ్లిన గష్టపడెదవు.’

‘నన్నింటికిఁ బంపి వేయుఁడు - మీకన్నివిధముల నావలనఁ గష్టము వచ్చును.

‘చూచుకొందము గాని రాత్రియైనది. పండుకొనుము. నీవు సందేహింపవలదు.’

‘నీకేమైనఁ గావలసి నన్నడుగ నిష్టము లేనియెడల చెల్లెలున్నది. దాని నడుగుము, నీవలన మాకేమియుఁ గష్టము లేదు.’

‘నాకేమియు వలదు. నన్నూరికిఁ బంపుఁడు.’

ఈమాటల కాతల్లి మాఱుమాట యాడఁజాలక కన్నీటితో లోనికిఁ బోయి కూఁతుతో ‘ఇదియే మీ యింటికిఁ బోదునా యని పట్టుపట్టినాఁడు. నీవేమైనఁ జెప్పి మరలింపఁగలవా’ యని ప్రసంగించెను. ఆముద్దుచెల్లెలువచ్చి తనమంచము నామంచము ప్రక్కనే వేయించుకొన్నది. నడుమ నడుమఁ జేరుపెట్టి - బిలుచుచు, ‘ఏమి మూలుగుచున్నాఁడవు. మంచినీరు కావలయునా?’ యని యడుగుచుండెను.

ఆబిడ్డతో నీయన-

‘నాకేమియు వలదు. నన్నూరికిఁ బంపి వేయరాదా!’

‘అదిగో నీవామాటఁ బట్టుకొని వదలకుండుట చేతనే యమ్మ వసారాలో విచారించుచున్నది.’

‘అట్లయిన నన్నికఁ దప్పక పంపివేయవలసినదే. నాకదేభయము-నావలన మీకుఁ గష్టము.’

‘మాకేమి కష్టము! సుఖముగా నున్నపు డుండనిచ్చి జబ్బుగా నున్నపుడు పంపివేయుదుమా?’

